S.No. 483 / Acc. No. 3895

ఓమ్.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

(పదునాలుగవ సంచిక PART II)

&

(పదునైదవ సంచిక PART I)








ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యస్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపంబడియె.

20-10-14.

COPIES AVAILABLE AT Y - GOVINDARAJULU CHETTY:
NO, 19, STROTTEN MOOTHIA MUDALY STREET; MADRAS.

( పదునాలుగవ సంచికానుబంధము. )

జర.— (అనగా ముదిమి, వార్ధక్యము) అనుదానినిగూర్చి రామచంద్రు డిట్లు చెప్పుచున్నాడు,

శ్లో॥ అపర్యాప్తంహిబాలత్వం బలాత్పిబతియౌవ్వనం।
యవ్వనంచ జరాపశ్చాత్పశ్యకర్రు శతాంమిథః ॥

బాల్యము సంపూర్ణముకాకమునుపే యౌవ్వనము దానినిపట్టి పీల్చుచున్నది. యౌవ్వనము సంపూర్ణము కాకమునుపే ముదిమి దీనినిపట్టి పీల్చుచున్నది. ఈముదిమియందును సుఖములేదు. సీత రావణునిజూచి, వానికి పౌర్ణమియనియును, రామచంద్రునికి ప్రథమ ద్వితియ్యలనియును జెప్పిన. వాడందుకుసంతసించెను. పౌర్ణమి యనగా, వృద్ధికివచ్చియున్న రావణుడు క్షీణించబోవుచున్నాడనియును, ప్రథమద్వితియ్యలోనున్న రామచంద్రుడు అభివృద్ధిజెంది ప్రకాశించబోవుచున్నాడనియును తాత్పర్యము.

శ్లో॥ అనాయాసకదర్థిన్యా గృహీతే జరయాజనే ।
పలాయ్యాగచ్ఛతిప్రజ్ఞాస పత్న్యేవాహతాంగనా॥

ముదిమి యందు నవద్వారములనుమూసికొని అవయవములన్నియును వదలిపోయి అనాయాసజాడ్యబాధలవలన, రెండవభార్యపై వ్యామోహమున మొదటిభార్యపై యాసవదలిపోవునట్లు, మనుజులకు బుద్ధిలేకపోవును. పూర్వపుగుణములన్నియును మారిపోవునని యర్థము.

శ్లో॥ దాసాఃపుత్రాఃస్త్రియశ్చైవ బాంధవాస్సుహృదస్తథా ।
హసంత్యున్మత్తకమివనరం వార్ధకకంపితం ॥

భార్య, బిడ్డలు, భృత్యులు, బంధువులు, మిత్రులు, అందరును ముసలితనముచే శరీరబిగివదలి వడకుచున్నవానిని పిచ్చివానివలె చూచి అలక్ష్యముగు పరిహాసమును చేయుదురు.

శ్లో॥ దుష్ప్రేక్ష్యం జరఠందీనం హీనంగుణపరాక్రమైః ।
గృధ్రోవృక్షమివాదీర్ఘం గర్ధోహ్యాభ్యేతివార్ధకం ॥

ముసలితనమునందు కన్నులుగానక, ధైర్యము,బలము,మంచిగుణములు లేకయుండినను చెట్టుతొర్రలో గ్రద్దయుండునట్లు ఆశమాత్రము ఆవేశించి యుండును. '×××సర్వాపదామేకసఖీ, వార్ధకేవర్ధతేస్పృహా' అన్నయూ పదలకును మూలమైన యీఆశ ముసలితనమునందు పెరుగుచుండును.

శ్లో॥ కర్తవ్యం కింమయాకష్టం పరత్రేత్యదిదారుణం ।
అప్రతీకారయోగ్యంహి వార్ధకే వర్ధతేభయం ॥

మరణము సమీపించినది. మరలజననకష్టములు రాబోవుచున్నవి, అనికష్టములు రాకుండ చేసికొనుటకు యేమియును దోచక యేమిచేయుటకును శక్తిలేక ముసలితనమునందు భయముకలుగుచున్నది.

ఇందువలననే 'జాతస్యహిధ్రువోమృత్యుః' అను గీతావచనమును జ్ఞాపకమునందుంచుకొని ఆత్మజ్ఞానముకొరకు బాల్యమునుంచి సాధకముచేయుచుండవలయునని తెలియుటకు ముకుందమాలలో 'శ్లో॥ కృష్ణత్వదీయ పదపఙ్కజపంజరాన్తః । మద్యైవమేవిశతు మానస రాజహంసః । ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః కంఠావరోధనవిధౌ స్మరణంకుతస్తే॥' ప్రాణము శరీరమును వదలిపోవునప్పుడు కఫవాతపిత్తములు కంఠమునడ్డగించుకొనగా, నీనామస్మరణచేయలేనుగాన యిప్పుడే చేయునట్లనుగ్రహింపుము, కృష్ణా! యని కులశేఖరాళ్వార్లు ప్రార్థించిరి. ఈప్రకారమే పెరియాళ్వార్లుగూడ చెప్పియున్నారు.—

పాశురం॥ వాయొరుపక్కంవాంగి వలిప్పవార్న్ద నీరుక్కుమిఴ్ కణ్ణాళ్ మిఴుట్టు । తాయొరుపక్కం తన్దై యొరుపక్కం తారమొరుపక్కమలత్తి తీయొరు పక్కంశేర్వదన్ మున్నం శెంగణ్మాలొడు శిక్కెనచ్చుత్తర్ । మాయ్వారుపక్కం నిర్కవల్లార్ కరవదండత్తిలుయ్యాలుమామే॥ అనగా, నోరువక్రమై, నాలుకతడబడుచుండగా, కండ్లు నీరుగారుచు గ్రుడ్లు వికారించుచుండగా, తల్లి, తండ్రి భార్య, చుట్టుకొని యేడ్చుచుండగా, నిప్పయొకప్రక్కన చేర్చకుముందే, భగవంతుని స్మరించవలయునని తా॥

శ్లో॥ కాలేసన్తిమేశివదయే మమతే ప్రసాదాత్ యేతావ దేవహృదయే
దృఢమావిరస్తు యద్వ్యక్షరం। శివశివేతితవాస్వదీయా మోక్షప్రదం
భువనమంగళనామధేయం॥ యనునట్లు ఇహపర సుఖానందముల నిచ్చునట్టి మంగళకరమైన భగవన్నామమగు 'శివ' అను రెండక్షరములనైనను అంత్యకాలమునందు స్మరించగలుగునట్లు అనుగ్రహించవలయునని ప్రార్థించిరి. అన్నియాశలనువదలి వైరాగ్యముతో రామాయని వాక పర్యాయము స్మరించిన అనేకపాపములు హరించిపోవుననియును పెద్దలు చెప్పియున్నారు. బాల్యమునుండి అభ్యాసముచేసిననే అంత్యకాలమున అట్టిస్మరణవచ్చును. లేకున్న రానేరదు. అంత్యకాలమునయేగమనము కలు

గునో అప్రకారమే మరల జన్మముకలుగును. అట్టి ప్రారబ్ధము భరతునికి గూడ తప్పలేదు. గానఅవసానకాలమునందు వేరుఆశయేమియును మనస్సునను నుంచక భగవన్నామస్మరణచేయవలయును. అందుకై బాల్యమునుండి అభ్యాసముచేయుచుండవలయును. వార్ధకదశలో భోగములయందు ఆశ పొడముచుండును. అనుభవించుటకు శక్తిలేక హృదయమును దహించుచుండును. శ్లో॥ పరిపక్వమివాలోక్య జరాఘోర విధూసరం ।

శిరః కూశ్మాండకం భుంక్తే పుంసాంకాలః కిపేశ్వరః ॥

ముసలితనమను బూడిదెపూతగల సిరస్సును పక్వమైన గుమ్మడిపండని యముడు ఆహారముచేయుచున్నాడు. ఇదిగాక మరణమను రాజువచ్చుటకు ముందు ముదిమి అను వింజామర బిరుదుతో రోగములు మనోవ్యాధులను సేనబయలుదేరుచున్నవి. ముదిమియను సున్నమువలన తెలుపెక్కిన శరీరమను అంతఃపురమునందు, అశక్తి, ఆపద, పీడ, అను స్త్రీలు దాగియుందురు.

ఇట్టిముదిమిని (ముసలితనమును) పొంది జీవించుటవలన మిక్కిలి దుఃఖకరమున్ను దారేషణపుత్రేషణ ద్రవ్యేషణములను వదలుట కష్టతరమున్ను అగుటవలన నేమియును ప్రయోజనములేదు అని రామచంద్రుడు జరాదుఃఖమును జెప్పెను. కాశీయాత్ర గంగాస్నానము మొదలైనవి జేసినను ప్రారబ్ధము వదలదు, బాల్యమునుండి ఆత్మార్థముగ పాటుపడి జ్ఞానమును సంపాదించుకొనిననే వార్ధక్యమునందు నిర్భయముగనుండవచ్చును. ప్రపంచత్యాగమును జేయువారే నిజమైన ఆనందమును అనుభవించుదురు. బైటబంధములుండిన లోపలియానందము నెట్లుజూడగలరు. అంతఃపురస్త్రీని అందరునుజూడజాలరు. యాస్త్రీలయొక్క బ్రహ్మస్వరూపులైన బిడ్డలుమాత్రము చూడగలరు. అట్లే ప్రపంచత్యాగమును మనస్సాచేసినవారే ఆత్మానందమును అనుభవించగలరు. ఆయానందమును దెలిసికొనినవెనుక యీసంసారాదుల నేమాత్రమునుయిచ్ఛయింపరు. అట్టిస్థితికి వచ్చుటకు యిదివరకు చెప్పబడినవన్నియునుపడికట్లు. భయమునుకష్టమును ప్రారంభమునదోచును. ఎంతకష్టమైనను సత్యమునందును వైరాగ్యమందును అక్కరగలవారు యిదివరకుచెప్పినవాటిని చక్కగ గమనించికడతేరుదురు ఇప్పుడు చెప్పినదంతయును చక్కగయోచించి సరియైనఅర్థముచేసికొనినట్లయినజాబునువ్రాసినవారి మనస్సునకు సహితము తృప్తికరమైయుండును.

*It is difficult to find happiness in ones self and it is impossible to find it elsewhere (said a German Philosopher, Schopenhear)* ఆనందమును తనలో తానుచూచుకొనుటయే కష్టమై యుండగా మరియొకచోట దానినికనుగొనుట అసాధ్యము) అని, షోపనెయరు అను నొక జర్మనీదేశపుపండితుఁడు జెప్పెను.) ఆనందము మనలోనే యున్నదిగాని, యెక్కడనో బయటవున్నదనుకొనడము మూఢత్వము. అది తెలసికొనుటకు పాటుపడవలయును. తెలిసికొనిన వెనుక బంధకము లేమియును వుండవు. కుక్కను ప్రేమతో పెంచి పైనెక్కించుకొని యలవాటుచేసినవాడు, కుక్కనీచమయినది గాన దానిని తాకిన స్నానముచేయవలయునని తెలిసికొనిన పిదప దానిని రావద్దనిన పైనబడి నాకుట వదలునా ? అట్లై బహుకాలముగా పెరుగుచువచ్చిన సంసారవాసన సులభముగ వదలదు, గాన శ్రవణమననాదులను చేసిచేసియే వదలించుకొనవలయును. కొలిమి తిత్తిని వూదగా వూదగా నిప్పుమందును లేకున్న ఆరిపోవును. ఇట్లు నొక్కినొక్కిచెప్పిననే వైరాగ్యముకలిగి పచ్చికట్టె యెండి బాగుగమండునట్లు మనస్సున చక్కగనాటుకొని ఆనందమననుభవించుటకు ఆస్పదమగును. అందరును యొకవిధముగనే బయటికి కనుపడుదురు. వారి వారిమనోపాకము యెట్టిదో యెట్లుదెలియును. ఒకసాధువును, యొక త్రాగుబోతును, యొకదొంగయును చేరిపోవుచుండగా దారిలో యొకచెట్టుక్రింద కండ్లుమూసికొని కదలక గూర్చునియున్న యొకమహానుభావుని యాముగ్గురిలోని సాధువుచూచి యతనొకసాధువనెను, త్రాగుబోతుచూచి, వాడు మిక్కిలి త్రాగి మత్తుడైయున్నాడనెను. దొంగచూచి వాడెక్కడనో దొంగలించి వచ్చి వేషమువేసికొని గూర్చున్నవాడనెను. అనగా, వారి వారి భావముననుసరించి బుద్ధిపరిణమించుచున్నదని తాత్పర్యము.

రామచంద్రునికి గురూపదేశము కాకపూర్వమే అంత వైరాగ్యముకుదిరినందున అంతలో అంతకష్టముతోచి విచారణచేసి యిన్నివిషయములను అనుభవసిద్ధముగ దెలిపెను. కాశీదేశమును పటములోచూచిన యేమియును ఆనందముకలుగదు. చూచివచ్చినవారు అందలివిశేషములను చెప్పిన కొంతఆనందము కలుగును. ప్రత్యక్షముగపోయిచూచిన యెంత ఆనందముకలుగునో చెప్పనక్కరలేదు. పెద్దలుచెప్పినవన్నియును సరియైనవని నమ్మి యోచించినట్లయిన, ముకుందమాలలో,

శ్లో॥ తృష్ణాతోయే మదనపవనోద్ధూతమోహోర్మిమాలే దారావర్తే తనయసహజగ్రాహసంఘాకులే చ। సంసారాఖ్యే మహతిజలధౌ మజ్జతాం నస్త్రిధామన్, పాదాంభోజే వరదభవతో భక్తినావం ప్రయచ్ఛ॥

ఓస్వామీ, ఆశయను జలముగలదియును, మన్మథుడనుగాలిచేత పొంగివచ్చు అలలుగలదియును, భార్యయను సుడిగలదియును, పుత్రులును తోబుట్టువులు నగుమొసళ్లగుంపుచే కలకబారియున్న సంసారమను మహాసముద్రములో మునగిపడియున్నట్టి మాకు నీపాదభక్తియనునావను దయచేయవలయునని యనిన్ శ్రీకులశేఖరాళ్వార్లు వలె ప్రార్థించక మానరు. అట్టిబుద్ధితో పాటుపడవలెను. శ్రవణముచేసి మననముచేయకుండిన ప్రయోజనములేదు. 'నాకపతిపదల్లాం తాక పశిత్తదాగినల్లణవు కొడుత్తెనైచ్చ చల్వమురవళర్' యను పాటలో శ్రీరామలింగస్వాములవారు చెప్పినట్లు 'నాయాకలినీయా కలివలెనెంచి నాకుమంచియాహారమునిచ్చి నాశరీరము కృశించక ప్రేమతో పెంచిన ఈశ్వరా, నామొరనాలకింపుమా' యని విలపించునంతటి వైరాగ్యముకలిగినవారికే యనుగ్రహముకలుగును. శ్రవణముచేసి మననముచేయుచువచ్చిన యొకానొకదినమున యోచన (పిడివాదము) కలుగును. పిడివాదమే వైరాగ్యము. స్త్రీపురుషులు పరస్పరవిషయసంబంధమైన ఆశలేకవుండడమే వైరాగ్యము. గోపాలకృష్ణుడును గోపికలను మెలగినవిషయములో యొకమహానుభావుడిట్లుచెప్పెను. *It is the love of the mistress towards the beloved minus carnality*' అనగా, విషయేచ్ఛలేని ప్రియనాయకనాయకీభావము అని యర్థమగుచున్నది. జీవులు స్త్రీలనియును పరమాత్మ స్వామియనియును, జీవాత్మపరమాత్మతో చేరవలయునను భావముతోనే పరమభక్తురాలైన శ్రీయాండాళు స్వామిని గోరినదిగాని మరియొక స్త్రీపురుషసంబంధమైన ఆశతోగాదు.

మానాభిమానమును వదలినభక్తి పరమోత్కృష్టమైనది. మాలకులమునబుట్టి పరమభక్తుడై పరమపదమును బొందిన నందుడను మహానుభావునియాతని యజమానుడైన యొకబ్రాహ్మణుడు తనకుపదేశము చేయుమని యడుగగా నందుడు యిట్లు చెప్పెను.

కీర్తన - పున్నాగవరాళిరాగం - ఆదితాళం.

ప॥ అయ్యేమెత్తకఠినం - ఉనకఠినమై - అయ్యేమెత్తకఠినం॥

అ॥ నయ్యాదమనివరుగ - ఉయ్యాదుకండుకొళ్లుం॥ అయ్యే॥

*　　*　　*　　*

వ॥ మానాభిమానంవిట్టు తానాగినింద్రవరుక్కు
సేనాపదిపోల్ జ్ఞానపదియుండు
పారుమే- కట్టికారుమే ఉళ్ళేరుమే అంబోసుమే।

*　　*　　*

( ఇందుకు తెనుగు. )

ప॥ అయ్యా బహుకోపం - మీవాడనే - నయ్యాబహుకఠినం ॥
చయ్యావచిత్తజాం । చల్యామడిగిచూడు॥ మయ్యా ॥

*　　*　　*

మానాభిమానంమాని - తానై నిలచియున్న ।
సేనాధిపతివలె జ్ఞానపదవియది ।
చూడుమా-కడతేరుమా-లో నానందమా-నందంపొందుమా॥ అయ్యా॥

*　　*　　*

అనగా, సంసారమందలి ఆశయును, తనశరీరమునందలి మానాభిమానమును వదలి యేకాంతముగనుండి విచారించుచుండిన ఆత్మజ్ఞానము కలుగునని తాత్పర్యము. గోపికలు భగవదనుగ్రహామునకు పాత్రులగుటకు మానాభిమానమును వదలియున్నారో లేదోయని పరిశోధించుటకే వారివస్త్రముల నపహరించి జలమునుండి వెలుపలికిరమ్మని భగవంతుడు చెప్పెను. రామచంద్రుడట్టి ఆశయును అభిమానమును వదలియున్నందుకు సూచకముగ యీప్రకారము యిదివరకు జరయును ముదిమియొక్క స్వభావమునుగూర్చి తనయభిప్రాయమును జెప్పెను.

---

ఓం.

శ్రీమాన్, బ్రహ్మశ్రీ. పెంగుళూరు, పండిత, శ్రీనివాస భాగవతస్వాముల
వారి జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము.

# వైరాగ్యప్రకరణానుబంధము.

---

(పదునైదవ సంచిక.)

శ్రీయుత, సి. యస్. రావుగారు యిటుల వ్రాసిరి:—

“శ్లో॥ దుర్లభంమానుషో దేహః, దేహినాం క్షణభంగురం।
తత్రాపి దుర్లభంమన్యే, వైకుంఠప్రియదర్శనం॥” అనునట్లు, మానవజన్మము గలుగుటయే దుర్లభము, మానవజన్మము గలిగినను, దీర్ఘాయువు గలుగుట దుర్లభము, ఆయువుగలిగినను భగవద్భక్తి గలుగుట అతిదుర్లభము. ప్రపంచమునందు మానవజన్మమునెత్తినవారలలో, నిత్యులు ముక్తులు, ముముక్షులు, బద్ధులు, అని నాలుగు విధములగు మనుజులున్నారు. జెంబడివాడు వలయొద్ద చేపలను పట్టుపద్ధతినిచూచి యున్నాముగదా. అట్టివలలో చిక్కుకొనినచేపలవంటివారు నిత్యులు; త్రుళ్ళితప్పించుకొని నీటిలోబడు చేపలవంటివారు ముక్తులు, తప్పించుకొనుటకు ప్రయత్నపడు చేపలవంటివారు ముముక్షులు, అట్టిప్రయత్నముచేయక ఊరక పడియుండు చేపలవంటివారు బద్ధులు. ఇట్లునాలుగుతరగతులమనుజులున్నారు. అందున ఆశాపాశాదులు అను వలలోబడి బంధవిముక్తికొఱకు ప్రయత్నము చేయక పడియున్న బద్ధులే యెక్కువగనుందురు. జ్ఞానము ఊరకరాదు. అందుకవశ్యమైన అన్నియంగములును కుదిరి యున్ననే మనస్సుయొక్క చంచలముడిగి జ్ఞానముకలుగును.

‘కర్మ’ అను చేవ్రాలితో నిన్నటిదినము వొకపత్రిక టపాలాద్వారా వచ్చినది. వ్రాసినవారు యీసభయందు శ్రవణము చేయువారిలోనొకరని అందువలన తెలియుచున్నది. ఇట్లు శ్రవణముచేయుచున్నను మనసు కుదరలేదని వ్రాసియున్నది. మనసుకుదరలేదని యెన్నిదినములున్నను యెట్లుకుదురును. కర్మను, భక్తిని, అనుష్ఠించిననే మనస్సుకుదిరిజ్ఞానముకలుగును. భగవద్గీత 18 అధ్యాయములలోను మొదటి 6 అధ్యాయములను కర్మనుగూర్చియును, వెనుకటి 6 అధ్యాయములను భక్తినిగూర్చియును, తక్కిన 6 అధ్యాయములను జ్ఞానమునుగూర్చియును చెప్పియున్నది. కర్మ

యనునది శరీరమును, భక్తి యనునది వుపాసనయు నైయున్నది. "యేయథామాం ప్రపద్యంతే, తాంస్తథైవభజామ్యహం" అని గీతలో చెప్పియున్నట్లు యెవరెవరేయేరూపనామములతో వుపాసన చేయుచున్నారో వారివారి కాయా రూపములతో భగవంతుడు అనుగ్రహించుచున్నాడు, మొదట సత్కర్మల చేయవలయును, సగుణోపాసన చేయవలయును వెనుక, నిర్గుణోపాసన జేయవలయును. అన్నిటియందును నమ్మకము కలిగియుండవలయును, సందేహముతో యేమిజేసినను ప్రయోజనములేదు. నమ్మకముతో వుపాసనమూర్తి ధ్యానము అనగా ఇష్టభగవన్నామ ధ్యానమును సదా చేయుచుండవలయును. "శ్లో॥ వేదేషు సారం, అఖిలాగమమంత్రతంత్రశాస్త్రేషు సారమపి శబ్దసముద్రసారం। సారేషు సారమిదమేవ హరేతినామ। యేనాపి కేనసకృదుచ్చరితం సధన్యః॥" అని యున్నందున అన్నిసారములకన్నను హరినామస్మరణ సారమే శ్రేష్ఠమైనది. పాపములను హరించి ముక్తినిచ్చునది గాన పెద్దలు అవలంభించినమార్గమునే గమనించి చేసిన పాపములను పోగొట్టుకొని మోక్షముకొరకు ప్రయత్నించవలయును. జనుల పాపమును పోగొట్టు గంగ అందుననున్న చేపలపాపమును పోగొట్టుచున్నట్లు పూరకవింటూవున్న మాత్రమున మనస్సుకుదరదు. ముందు సత్కర్మలు చేయవలయును. భక్తికలుగవలయును. వెనుకనే చిత్తశుద్ధి కలుగును. "మథ్యమథ్య స్థితోభవా" యను ఉపనిషద్వాక్యము ననుసరించి అప్పుడప్పుడు చక్కగా విచారణచేయవలయును. కర్మభక్తిచేయక చిత్తము శుద్ధికాదు. యెంతవింటూవున్ననుకుదర లేదనియనుకొనినఎట్లుకుదురును. పగలియున్న భూమిపై విడిచిననీళ్ళు పగళ్లలోనింకిపోవునే గాని పైరులకు పారకపోవునట్లు యెంతవిన్నను గాలికిపోవునేగాని మనస్సునపట్టదు. మనస్సునందుగల మలినముపోయిచపలము వదలిననే పట్టును. చపలమున్నంతవరకుమనస్సున నేదియునుపట్టదు. యెంతజ్ఞానముగలవారైనను కొందరు కలరా మొదలైనవ్యాధులకును యితరవుపాధులకును భయపడి పారుగాళ్ళకు పారిపోవుదురు. "ఊరువిట్టు పరవూరిగెహోదరె, ప్రారబ్ధవు బెరాతీతే" యను కీర్తనలో శ్రీపురందరదాసుగారు చెప్పినట్లు, యెకడకుపోయినను ప్రారబ్ధముఅనుభవించకతీరదను జ్ఞానములేక విచారణచేయక యిట్టిచపలమును యితర బహిర్వ్యాపారములును గలిగియున్న యెట్లు మనస్సుకుదురును.

(సశేషము.)

ఓమ్.

జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము

# వైరాగ్యప్రకరణానుబంధము

(పదునాలుగవ సంచిక)

**PART I**








ఇది,

శ్రీమాన్, బ్రహ్మశ్రీ బెంగుళూరు

పండిత శ్రీనివాస భాగవత స్వాములవారిచే

నుపన్యసింపబడి

శ్రీయుత సి. యన్. రావుగారిచే వ్రాయబడి

మద్రాస్

శ్రీలక్ష్మీ నృసింహ విలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడెను.

9-10-14.

COPIES AVAILABLE AT Y - GOVINDARAJULU CHETTY:

NO, 19, STROTTEN MOOTHIA MUDALY STREET: MADRAS.

శ్రీమాన్, బ్రహ్మశ్రీ, కొండూరు, పండిత, శ్రీనివాస భాగవతస్వాముల
వారి జ్ఞానవాసిష్ఠోపన్యాస సంగ్రహము.

# వైరాగ్య ప్రకరణ సంబంధము.

---

(పదునాలుగవ సంచిక)

శ్రీయుత, సి. ఆర్. రావుగారు యిట్లు వ్రాసిరి.—

నేటియుపన్యాస ప్రారంభమున శ్రీభాగవతస్వాములవారు సభ వారినుద్దేశించి యిట్లు చెప్పిరి.— ఉపన్యాసకాలమునందు స్త్రీలుగూర్చుండుచోటనుండి వచ్చెడిమాటల సందడివలన కొందరకు శ్రవణభంగమగుచున్నదని చెప్పిరని యిదివరకే నాలుగవ యుపన్యాసమునందు సభలో తెలుపబడినది. ఆయుపన్యాస సంచికయందును జూడవచ్చును. ఇప్పుడును అచ్చోటనే అట్టి సందడి గలుగుచున్నదని మరల దెలియవచ్చినదిగాన సభ వారిలో స్త్రీపురుషులలో నెవ్వరైనను అట్టి యసందర్భము లేమియును కలుగనీయక మిగుల శ్రద్ధావంతులై శ్రవణము సేయుదురని మరిమరి ప్రార్థితులు.

ఇదిగాక, యీసభలో శ్రవణముచేయువారిలో నొకరని మాత్రము తెలిపి వారిపేరులేక యొకానొక పోస్టుకార్డును పంపిరి. దానిలో కొంతకాలము యుపన్యాసములలో యీవైరాగ్య ప్రకరణము సంబంధ విషయమును విప్పి చెప్పడము వినుచున్నాముగాని మనస్సునకు శాంతి గలిగి సంసారమునందెట్లుండవలసినదియును దెలియలేదుగాన తెలుపవలయునని వ్రాసియున్నది. ఆవిషయమును యిదివరకే బహిరంగముగ సభలో చెప్పబడియున్నది. అట్లు విప్పిచెప్పినవినుటకు కొందరకు కష్టముగనే తోచును. మరుగుబెట్టక చెప్పిననే మనస్సునందుపట్టును. లేకున్న యుల్లిగడ్డలోపల యేమో యున్నదని తోచినట్లు తోచుచుండును. యుల్లిగడ్డను లోపలివరకు నొలువగా వట్టితోలేగాని వేరేమియును లేదని తెలియునట్లు బాగుగ విచారించి విప్పిచూచిననే ప్రతివారియొక్క బండారమును బైటపడి భ్రమదీరును. శ్రీరామచంద్రుడు వాసిష్ఠమునందట్లు విప్పి చెప్పియున్నారు. పెద్దలందరును అట్లనే విప్పిచెప్పియున్నారు. స్త్రీభోగమును జాతిభేద

మును సంప్రాప్తించిన స్థితియే సమాధియని చెప్పియున్నారు. విచారణవలన వైరాగ్యముకలిగిననే అట్టిస్థితికిరావచ్చును. శ్రవణమనననాదులవలననుసద్గురూపదేశమువలనను అట్టి వైరాగ్యముకలుగును. భగవదనుగ్రహమువలన సద్గురువు లభించును. అయితే శ్రీ రామచంద్రునికి గురూపదేశము కాక మునుపే యట్టివైరాగ్యముకలిగినది. అందరి కట్లుగలుగదు. అనేకపాపములను చేసినవారికెట్లుగలుగును. కావుననే శ్రీ వేదాంతదేశికులవారు,

శ్లో॥ యద్భ్రూవిభ్రమ్యాల్ప సమయతాను భవేత్పరార్థ్యం ।
తత్కల్మషం ప్రజతి జంతురిహానవద్యా ।
యేవం సదా సకల జన్మసు పాపపుంజం ।
క్షామస్య హా, తదఘం, సాధో, వినానుగ్రహాత్ ॥

అనగా, మనుజుడు అనిమిషకాలములో చేయుపాపమునకై యెన్నియో కల్పకోటిజన్మములు యెత్తవలసి యుండగా, జన్మాంతము వరకు చేయుపాపములకు యెన్ని తెలియలేని జన్మలు యెత్తవలయునో, భరించలేను గాన క్షమించి యనుగ్రహించవలయునని భగవంతుని ప్రార్థించిరి. భగవదనుగ్రహము పూర్ణముగ నుండవలయును. సద్గురువులు స్వామిగా వచ్చి యుపదేశముచేయుదురు. మనుజులకు రజోగుణముండకపోవలెను. భగవద్గీత ౩ వ అధ్యాయము ౩౭ వ శ్లోకమునందు,

శ్లో॥ కామయేషః క్రోధయేష రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహవైరిణమ్ ॥

యని కృష్ణభగవానులు చెప్పినట్లు కామము క్రోధము యీ రెండున్ను రజోగుణమువలన పుట్టినవి. కామమనగా, ఆశ (ఆశకు మేరలేదు కనకాద్రి సమానధనంబుగూర్చినన్ ) 'కామాత్క్రోధోభిజాయతే' యను ౨వ అధ్యాయము, ౬౨వ శ్లోక ప్రకారము కామమువలన క్రోధముగలుగుచున్నది. మహాపాతక హేతువైన యీ క్రోధమువలన 'బుద్ధినాశాత్ప్రణశ్యతి' యను ౬౩ శ్లోకప్రకారము బుద్ధిహీనులతో మనుజుడు నశించుచున్నాడు. గాన, కామక్రోధములు రెండున్ను రజోగుణ జన్యములనిన్ని

ముముక్షువులకు శత్రువులనిన్ని తెలిసికొని రజోగుణమును హతముచేయవలయును. ఇందుకై చక్కగా విచారణచేయవలయును. వైరాగ్యముకుదిరిన పిదపనే సద్గురూపదేశము లభించును. అటుపిమ్మట నిత్యానిత్యవస్తువివేకముకలుగును. పెద్దల (సత్పురుషుల) సాంగత్యమును సదా శ్రవణమననాదులును చేయుచుండవలయును. రామాయణమునందు, 'త్యక్త్వా పుత్రాంశ్చదారాంశ్చ రాఘవం శరణంగతః,— భార్యా పుత్రాదుల సంపదను వదలిపెట్టివచ్చి రాముని శరణుజొచ్చితిని, అనివిభీషణుడు చెప్పినట్లు, అన్నియును మనస్సావదలినదే వైరాగ్యము. అట్లువైరాగ్యముకలిగిననే యుపదేశమునకు తగినవారౌదురుగాన విభీషణుడట్లు తానుతగినవాడని తెలుపుటకే యాప్రకారము చెప్పెను. కనుకనే యుపన్యాసమునందిట్లు పలుమారు చెప్పవలసియున్నది. అట్లు చెప్పకపోయిన మనస్సునపట్టుట మహాకష్టము. ఒకరు ప్రతిదినమును స్నానముచేయుగుంటలో మొసలియున్నదనిన్ని, సుడిగుండము యున్నదనిన్ని చెప్పిన, అందులోనికిబోయి యీతకొట్టుట మొదలైనకార్యములుచేసి యామొసలివాతబడకనున్న యాసుడిగుండములోబడి ప్రాణమును పోగొట్టుకొనకనున్న జాగ్రతగా మున్ముందుగనుండి స్నానసంధ్యాదికృత్యములను దీర్చికొని చక్కగా రమ్మని చెప్పటయేగాని గుంటకుపోవద్దనిగాని స్నానసంధ్యాదులను చేయవద్దనిగాని చెప్పటగాదు. అట్లే సంసారము దుఃఖసాగరముగాన అందులో అంధులవలె దొరబడి అష్టకష్టములను దెచ్చుకొని చెడిపోక ఆత్మసుఖమునకై పాటుపడవలయునని చెప్పిన, దారాపుత్రాది సంసారమును వదలిపెట్టి సన్యసించి యడవులకు పొమ్మనుటగాదని యిదివర కెన్నిపర్యాయములో స్పష్టముగ చెప్పబడినది. ఇంటిలో సర్పమున్నది, భద్రమనిచెప్పిన దీపము మొదలయిన జాగ్రతలవలన సర్పభయమును మాన్పుకొను ప్రయత్నము చేయుమని చెప్పటయేగాని యింటిని యిడియగొట్టిపొమ్మని యర్థముగాదనియును, దేనియందును మనస్సును పూనక అంటియంటనట్లు మెలగుచు అన్నిటిని మనస్సా త్యజించి జాగ్రతగ నుండవలయుననియును అర్థమని చక్కగా గ్రహించవలయును.

భక్తివైరాగ్యములుగలిగి అన్నియును భగవత్స్వరూపములనిదృఢముగ మనస్సునకు తోచవలయును.

శ్లో॥ పుత్రదారాదికంసర్వం జానాత్విహరేరపి ।
ఆత్మానాం మనసావాచ సభక్తఃకథితోబుధైః ॥

అనునట్లు దారాపుత్రాదులను సమస్తమైనవాటిని భగవత్ స్వరూపమని యెవరు మనోవాక్కులచే తలంచి ఆప్రకారము ప్రవర్తించుచున్నారో వారే వాస్తవమైన భక్తికలవారనఁబడుదురు. మంచిమాటలు చెప్పినను మంచికార్యము చేయుటకును మనస్సునకష్టముగనే దోచును. అట్లేకష్టమని కాలముగడపుదు స్త్రీపుత్రాపత్యమను వలలో దగుల్కొని సంసారసాగరమునందుబడి చింతలపాలై చెడిపోవుచుండిన వాస్తవమును తెలిసికొని ఆత్మజ్ఞానమునుబొంది సుఖించుట యెప్పుడు.

పాశురము.— మానేయ్కణ్ణార్ మయక్కిల్ పట్టుమానిలత్తు
నానేనానావిద నరకంపు గుంపానంఱుమ్ చెయ్దేన్
తేనేయ్పొంపొలిల్ తిరువేంగడమామలై యెన్
ఆనాయ్ వందడైందేన్ అడియేనైయాట్కొండరుళే ।

చంచలమయిన నేత్రములతో జనులను సోకించు స్త్రీలవలలో చిక్కి నానావిధములైన నరకహేతువులగు పాపములనుజేసి కడపటినీవేదిక్కని నీసన్నిధిని జేరితిని, అని తిరుమంగైయాళ్వార్లు జెప్పియున్నారు. ఇట్లు పెద్దలైనవారు తెలియజెప్పిన విషయములన్నియును చక్కగ యోచించి తెలిసికొనినననే మనస్సావదలవచ్చును. బయటికన్నియును వున్నట్టుండినను మనస్సునందు వాటియందలి ఆశనుమాత్రమ్ము వదలిపెట్టియుండవలెను. ఎంతకాలము యెన్నిపర్యాయములు చెప్పినను శ్రవణకాలమునందు వినఁబడి యొకచెవిని దీసికొని మరియొకచెవిని వదలునట్లున్నదిగాని, వినినదానిని మననముచేయునట్లు కనుపడలేదు. వడ్లను దంచగా దంచగా పొట్టును, తవుడును, దువ్వయును పోయి తుల్యముగ బియ్యము తేరును. అట్లగునంతవరకును దంచవలయును. అందువలననే పదేపదే చెప్పవలసియున్నది సంసారాదులయందు పామరము వుండునంతవరకును వైరాగ్యముకలుగదు. రామకృష్ణపరమహంసగారు వారి వేదోపన్యాసమునందు *'Would you like to place in a room a big water jar and a patient laid up with tyqhoid fever'* అనగా, తాపజ్వరము దగిలిన వ్యాధిగ్రస్తుడున్నగదిలో పెద్దనీళ్ళకడవనుంచుదురా' యనిరి. జ్ఞానమునకు దాహము

సరిపడదుగాన పరస్పరవిరుద్ధములైన వస్తువులు నొకచోట నిమిడియుండడము తటస్థించదన్నట్లు పామరమున్న వైరాగ్యముండ, వైరాగ్యమున్న పామరము నొకచోట నుండదనియును, తాపత్రయము గలవారికి దాహము చూపిన నెట్లి ఆతురముతో దానిని పట్టుకొనెనో, అట్లు సంసారబంధమున దగులుకొని వ్యర్థముగ కాలమును గడపుచున్నామేయను వ్యసనము గలవారికి వైరాగ్యముకలుగు మార్గమును జూపిన దానికననుష్ఠించుదురని తాత్పర్యము. ఇందుకొరకే రామచంద్రుడు మొదట వైరాగ్యవిషయమును తెలిపెను. అట్టి వైరాగ్యము గలుగుటకు నిశ్చయముచేసినదానిని చక్కగ మననముచేయవలయును, అట్లు మననము వలన మనస్సు దృఢము గనిలచిన గురూపదేశము సులభముగ లభించును. అట్లుచేయక గుంటలో మొసలి, యింటిలో పాము, అనగానే భయపడి తగునైన జాగ్రతలో నుండుటకు తెలియక గుంటలో స్నానసంధ్యాదులను యింటిలో అన్నపానాదులును చేయక పారిపోయిన కార్యసాధకమెట్లగును.

ఇట్లు సత్యమైనమాటలను వినెడివారియొక్క మేలుకొరకై చెప్పుదురు. పెద్దలైనవారందరును అట్లనే చెప్పియున్నారు. చెప్పెడు వారిని దూషించిన నేమి ప్రయోజనము. సత్యమును చెప్పెడివారు నొకరిచేతికి కాచియుండక వినువారు లేకుండిన చెంబుచేత కెత్తికొని వినెడువారుండెడి మరియొకచోటికి పోగలరు. గాన సత్యమైనవిషయములను చక్కగ తెలిసికొని మననముచేయవలయును. జాగ్రతగానుండు పద్ధతిని తెలిసినవారివద్ద తెలిసికొని యెప్పుడు బుద్ధిని కుదురుబాటుచేసికొందురో అప్పుడే భయము దీరిపోవును. పాములవాడు విషమునకు మందున్నదని తెలిసి భయము లేక పాములను పట్టియాడించును, యితరులకామందు తెలియనందునభయపడుదురు. ఆప్రకారము వేదాంతశాస్త్రశ్రవణ మననాదులనుమందువలన అన్నిభయములును వదలిపోవును.

మనదేశము యాత్మజ్ఞానమువలననే గొప్పవహించినది. అమెరికాదేశమన్నిటియందును ఆధిక్యతను వహించియున్నను, యాత్మవిషయమునందువ మాత్రము మనవల్లనే వారు తెలిసికొనవలయును. సూర్యుడెట్లు తూర్పున ప్రకాశించి పడమరవైపునకు పోవునో అట్లు తూర్పుదేశమువ

మన దేశమునందలి తత్వప్రకాశము పడమటి దేశమైన యీ అమెరికాకు పోవలెను. అంతగొప్పదియైన తత్వశాస్త్రమును తెలిసికొని వైరాగ్యభక్తిశ్రవణమననాదులవలన ఆత్మానందమును సంపాదించుకొనవలయును. మానుష్యునకు ముందుగ వైరాగ్యమే బలము, మొట్టమొదట వైరాగ్యమే అవశ్యమైనది, పీఠమువంటిది. దానివలన యెట్టిగొప్ప కార్యమునను సాధించవచ్చును. కైలాసమును బంతిగా చేసికొని యాడించిన రావణుని, వేయిచేతులుగల కార్తవీర్యార్జునుడు ఆడించెను, అట్టి కార్తవీర్యార్జునుని పరశురాముడు హతముచేసి వానిరక్తమును తర్పణము విడిచెను. అట్టి పరశురాముని గర్వము రామచంద్రుడు అణచెను. రామచంద్రునకు అదియుండి అంత బలమయిన వైరాగ్యము కుదిరియుండినందుననే అంతబాహుబలమును మనోబలమును కలిగినది. పన్నెండువేల రాక్షసులను ఖరపర్యంతము తానొంటరివాడై హతముచేసెను. అప్పుడు 'తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహం । బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే॥ యని రామాయణమునందున్నట్లు, ఇందర శత్రువులను ఒకడై చంపి ఋషులకు సౌఖ్యమును కలుగజేసిన 'అసహాయశూరుడు' యని కౌగలించుకొని సీతగూడ మెచ్చుకొనునంతబలము రామునకు వైరాగ్యమును బాల్యమునుంచి పీఠముగా జేసికొనినందుననే కలిగినది. సంసారికి ద్రవ్యము లేకున్న సుఖములేనట్లు ముముక్షువుకు వైరాగ్యము లేకున్న సుఖములేదు. లక్ష్మణుడున్ను వైరాగ్యమును బూనినవాడై 'అహం సర్వం కరిష్యామి జాగ్రతస్స్వపతశ్చతే' యని పద్నాలుగు యేండ్లు నిద్రాహారములు లేక రామునితోనుండినదియేగాక 'యేకస్య మరణం మే అస్తు మాభూత్సర్వ వినాశనం' వొకరునికి మరణముగలిగినను కలుగునుగాక లోకమంతయును సుఖముగనుండవలయును. అను వ్రతమును మొదటనుండి పట్టి యింద్రజిత్తు యుద్ధములో మేఘములయందు దాగి యెన్నిబాణములకును చావకుండిన 'ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది' యని సత్యసంధుడైన యీరాముని స్మరించి వైరాగ్యమును పూని బాణమును వేసిన వెంటనే ఇంద్రజిత్తు చచ్చిపడెను. వైరాగ్యముయొక్క బలమిట్టిదని తెలియవలయును. ఇదిగాక యీ దేశమునందే అరువది మువ్వురు నాయనార్లు భక్తివైరాగ్యములు కలిగి తరించినది ప్రసిద్ధమయ్యేయున్నది.

కారుచుండగా వినాయకుడని చేమని యడిగిన సకలజీవరాసులును నేనే గావున నీవు పిల్లినెత్తుమీద గీసినగాయము నాకునుగలిగినదని పార్వతిచెప్పగా విని, అట్లయిన లోకములోని స్త్రీలందరును నాకు తల్లులుగాన నాకు పెండ్లివద్దని వైరాగ్యముతో చెప్పెను. ఇంతకఠినమయిన విషయమును వొకటి-సారి సూక్ష్మముగ చెప్పవచాలదు. కనుసీఱగూనె బుద్ధిని పదిమారులు కలిగిననేగాని కలుగదెప్పుడును. అట్లు పలుమారు పట్టుగ చెప్పిననే జన్మాంతరవాసన కొంతపోయి వదలించుకొనుటకు మార్గముకలుగను. అన్ని కష్టములలో కొంచమైనను భగవంతుని స్మరించేయుదురు. నారదమహర్షి తనకంటె సదా భగవన్నామస్మరణ చేయుభక్తుడు మరియొకడు యెందునను లేడని యొకానొకప్పుడు గర్వించినప్పుడు శ్రీకృష్ణభగవానులు తెలిసికొని ఆసంగతిని చెప్పక యొకగొల్లపల్లెలోనున్న యొక కాపువానిని గురుతుచెప్పి వానిభక్తిశ్రద్ధలు యెట్టిదో చూచివచ్చి చెప్పమని నారదులకు నియమించెను. అట్లే వానిని చూచివచ్చి చెప్పెను, స్వామీ, వాడొక పెద్దసేని నన్నుపోయి నీవెవరన్ననిన వాడెంతటివాడో యని యనుకొంటిని. వాడొకడు యీ సంసారి బహుకుటుంబి సూర్యోదయాత్పూర్వము మొదలు సూర్యాస్తమానాంతరమునకు వాని గుడిసెనుండి దూరముపోయి పొలమున కష్టపడివచ్చి అర్ధకడుపు గంజిత్రాగి బ్రతుకుచున్నాడు. ప్రొద్దున నిద్రలేచునప్పుడును రాత్రిపడుకొనునప్పుడు మాత్రము నారాయణ యని యనుచున్నాడు. అని చెప్పగా కృష్ణభగవానులు యొకచిన్నపాత్రమునిండుగ యేమాత్రము చలించినను వొలుకునట్లు నూనెపోసి దానిశిరస్సున నుంచుకొని తనగదిని ప్రదక్షిణముచేసిరమ్మని నారదులకు చెప్పెను. ఆప్రకారమే అతిజాగ్రతగ యొకబొట్టయినను వొలకకుండ తెచ్చిచేర్చగా, కృష్ణభగవానులుచూచి, నారదా యీప్రదక్షిణకాలములో నన్నెన్నిమారులు స్మరించితివని యడిగిన, స్వామీ, నామనస్సంతయును పాత్రమునందు పెట్టియుండగా నేనెట్లు నిన్ను స్మరించుదునని నేను. అప్పుడు, కృష్ణుడునవ్వి, యింతమాత్రమునకు నీవు స్మరించలేకపోగా యాకడుపేదరిక కుటుంబసాగరమునందుబడి యీదులాడుచున్న యాకష్టజీవి నన్నుమరువక అంతమాత్రమయినను స్మరించుచున్నాడేయని చెప్పెను.

రామచంద్రుడింతకుపూర్వము శరీరనశ్వరమును, బాల్య, యౌవనాది యవస్థలను తెలిపి యిప్పుడు,

( సశేషము- )

'భక్తవత్సల మర్చితాంనిధి - మక్షతాంహరిదంబరం,
సర్వభూతపతింపరాత్పర - మప్రమేయమనుపమం|
సోమవారినభోహుతాశన సోమపాద్యఖిలాకృతిం,
చంద్రశేఖరమాశ్రయేమను - కింకరిష్యతివైయమః|
'విశ్వసృష్టివిధాయకంపున - రేవపాలనతత్పరం
సంహరంతమపిప్రపంచము - శేషలోకనివాసినమ్|
క్రీడయంతమహర్నిశంగణ - నాథయూథసమావృతం,
చంద్రశేఖరమాశ్రయేమను - కింకరిష్యతివైయమః||

యనిమార్కండేయులు యీప్రకారము స్తోత్రముచేయుగా యతడాలింగనము చేసికొనియున్న లింగమునందుండి పరమశివుడావిర్భవించి యముని నిగ్రహించి మార్కండేయుని చిరంజీవిగను యెప్పటికిని పదియారేడులబాలకుడై మృత్యుంజయునటులననుగ్రహించెను. ఇట్లు శ్లో|| సంసారసర్పదష్టానాం జంతూనామవివేకినాం| చంద్రశేఖరపాదాబ్జ స్మరణంపరమౌషధమ్|| సంసారమను సర్పముచేకొరకబడిన మూఢజనులకు, భగవత్పాదారవిందస్మరణ పరమౌషధమనియును శ్లో|| మార్కండేయకృతంస్తోత్రం - యఃపఠేచ్ఛివసన్నిధౌ| తస్యమృత్యుభయంనాస్తి - సత్యంసత్యవదామ్యహం|| ఈమార్కండేయులవారి భగవన్నామస్తోత్రమునుపఠియించువారికి మృత్యు (యమ) భయము లేదనుమాటసత్యమనియును పెద్దలుచెప్పియున్నారు.

ఈప్రకారము మనస్సునందుదృఢమైననమ్మకముగలువలయును, కుతర్కవాదములు చేయుచుండిన యెన్నటికిని నమ్మకముగలుగనేరదు. దేవాలయమునందు అర్చకులవద్ద పదితులసిదళములేయుండినయెడల వేయిమంది సేవార్థులకు వినియోగముచేయను సాధ్యపడక యాదళములను క్రిందచల్లివేయగా అందున నమ్మకముగలవారు భక్తిశ్రద్ధలుగలిగి యొట్లుపైపైబడికష్టపడియెత్తికొనుటకు ప్రయత్నపడి సాధింతురో అట్లునమ్మకమును భక్తిశ్రద్ధలునుగలిగి భగవన్నామ ధ్యానపరాయణులై సంసారాదివిషయములందు విముఖులై మృత్యు (యమ) భయములేక బ్రహ్మానందమగ్నులైయుండుటకు దృఢచిత్తముతో పాటుపడవలయును. అట్లుగాక సదా సర్వకాలమున్ను దారాపుత్రధనాలయాదులకు యీశరీరము పాటుపడుచుండిన ఆత్మానంద సుఖమునకై పాటుపడుట కెప్పుడైన యెట్లునవకాశముగలుగును. అహంకార

మను కారములవలన అన్నియు, నేను, నాది, అని తోచుచుండును. ఎవరికి వారే స్వంతముగాని, బహిర్ముఖమున కనుపడువాటిలో యొకటియైనను స్వంతముకాదు. కాలము (యముడు) వచ్చి యీశరీరము పోవునపుడు భార్యయెకూడ, బిడ్డలుయెకూడ ధనదాన్యాదు లెకూడ, యేమియును దీసికొనిపోవుటలేదు. యేదియును వెంటరాదు. ఇవియన్నియును అనుభవ సిద్ధమైన వార్తలుగాని వేరుకాదు.

శ్లో॥ xxx అస్మాకంతు మనోరథో పరచితప్రాసాదవాపీతట।
క్రీడాకానన కేళికౌతుకజుషా మాయుఃపరిక్షీయతే॥

యని భర్తృహరి వైరాగ్యశతకమున జెప్పినట్లు మనుజులు మనస్సు యొకూ వృత్తభ్రమచేత కల్పించుకొను యిండ్లువాకిండ్లు దొడ్లు తోటలలో కల్లవిహారములు సలుపుచు అనగా నేదియును నిజముగ ననుభవించక బ్రహ్మజ్ఞానమును గడింపక యూరక భ్రమతో కాలముఁబుచ్చి తుదకువ్యర్థులై ప్రాణమును విడచుచున్నారని తాత్పర్యము.

సంసారబంధమును యిట్టిదని తెలిసికొని జగత్సంబంధమైన వ్యాపారములయందు యేమాత్రమును సుఖములేదని మనస్సావిరక్తిని పొందవలెను. నదీప్రవాహామునందు రెండుకట్టెలు వొకటిగా కొట్టుకవచ్చి యాప్రవాహము రెండుపాయలుగా చీలిపోవుచోట యొక కట్టె యొకవైపునను రెండవకట్టె మరియొకవైపునను వెవ్వేరైపోవునటుల యొకరికొకరికి యెట్టి సంబంధమునులేదనియును, మనుష్యులు ముదిమికిని మృత్యువునకును స్వాధీనులై సిథిలమగుచున్నారనియును, పుట్టినవస్తువుకు నాశము సిద్ధమనియును, ఆయుస్సు దినదినమును తగ్గుచున్నదనియును, మృత్యువు యెప్పుడైన వాతవేసికొనుటకు కూడ నేదిరుగుచున్నదనియును, చకూగ నాలోచించి తెలిసికొని తత్వజ్ఞానములేకుండు యాత్మనుగూర్చి దుఃఖపడవలయును. అట్టిదుఃఖముగలిగి అన్నియును నిష్ఫలములని సుఖమునివ్వజాలవని మనస్సా విరక్తిని జెందునట్టివాడే ఆనందమూర్తి, ముక్తుడు. నిర్మలమైనమనస్సుతో భగవద్ధ్యానమునుజేయుచు మగ్నుడై నెయ్యివలె మనస్సునుకరగించునదే ముక్తి సాధారణముగా వుపన్యాసమును వినునంతవరకు మనస్సుకు బాగుగనేవుండును. తర్వాత అన్నియునుమరచి గుళ్ళకుగోపురములకు గుంపులో పోవలెననియును మఠవుళిలోదూరి మంచిప్రసాదములు ఆరగించుటే ముఖ్యముగనుదోచును స్వామిని శేవించునపుడు, ఆభరణ వస్త్రాద్యలంకారముల

న, యితర జనులను, స్త్రీలు పురుషులను పురుషులు స్త్రీలను యిదిగాక దాసీజనమునుచూచి మనస్సు యానందించును. గుంపులోనికిబోయి యిటు వంటిసార్థకములేని కార్యములయందు మనస్సును ప్రవర్తింపజేయుటయే గాక పాపమునుకూడ మూటకట్టికొనవలసియుండును.

పాశురము «ఇరుళిరిందచ్చుడర్ మణిగళిమైక్కుం నెత్తి। ఇనత్తుత్తియణిపణి మాయిరంగళార్న్ద। అరవరశప్పెరుంజోతియనన్దనెన్నుం। అణివిళంగుము యర్ వెళ్ళై యణైయైమేవి। తిరువరంగప్పెరునగరుళ్ తెణ్ణీర్ప్పొన్ని। తిరై కైయాల్ అడివరుడప్పళ్ళికొళ్ళుం।కరుమణియై కోమళత్తై కణ్డుకొం డు। ఎన్ కణ్ణిణైగళ్ ఎన్రుకొలో కళిక్కుంనాళే॥' యని శ్రీకులశేఖర యాళ్వార్లు చెప్పినటుల స్వామిని సేవించునప్పుడు స్వామితిరుముఖమండలము నుంచి పాదములవరకును మనస్సున ధ్యానించి అజ్ఞానమను చీకటినిబోగొ ట్టి జ్ఞానప్రకాశమునిచ్చుజ్యోతి స్వరూపుడని భావించి యానందించవల యునను బుద్ధికలుగవలయును. అట్లు కలుగుట అరిది. అంతగుంపులోనున్న పుడనేకవిధములుగ మనస్సు చంచలించుచుండును గాని యూరకుండదు.

నిజమైన తీవ్రమును వైరాగ్యమును ధైర్యమునుగలిగిన అన్నియుపా ధులను తప్పించుకొనవచ్చును, అన్నియును సాధించవచ్చును. పట్నత్తుస్వా మిభద్రగిరిరాజ్యమునకుపోయి వొక విఘ్నేశ్వరునిగుడిలోపల నిష్టాగరిష్టు డై చలించక కూర్చునియుండెను, ఆ రాత్రిభద్రగిరిరాజుయింట దొంగలిం చనుపోయినదొంగలు తమకుదొరికినసొమ్ములో కొంతసొమ్ము సమర్పించె దమని యావిఘ్నేశ్వరునికి ప్రార్థనజేసికొనిపోయినప్రకారము మరలవచ్చి తమరు రాజుగారింట దొంగలించిన సొమ్ములో నొకకంఠాభరణమునదీసి చీకటిలో యావిఘ్నేశ్వరునికి ముందుగూర్చునియున్న పట్నత్తుస్వామియే విఘ్నేశ్వరుడనుకొని ఆయనకంఠమునబడవైచిపోయిరి. మరునాడు రాజభ టులు దొంగలను వెదకుచువచ్చి యాగుడిలో కంఠాభరణముతోడ నిశ్చల ముగ నిష్టలో కూర్చునియున్న పట్నత్తుస్వామినిచూచి యాయనే దొంగ లించియాప్రకారము వేషమువేసికొనియున్నవాడని దీసికొనిపోయి నంతట భద్రగిరిరాజాయనను కొర్రికొయ్యం గ్రుచ్చివేయునట్లాజ్ఞాపించెను. భటు లతు లాయన నాకొయ్యచెంతకు తీసుకొనిపోగా అపుడు పట్నత్తుస్వామి 'ఎన్నెయలావదియాదొందుప్రిమ్మిల్లై యినిదైవమే।యున్నేయులేయెంగ్రుణర ప్పెత్తేయిందవానెడుత్త। పిన్నెయదటివిన్నై యాదొంత్రుమిల్లై పిరప్పవ

రురు। మున్నే యదతీవినైయోవిజ్ఞ నేవందు మూండరువే॥ అనగా నాపసు లవలన సిద్ధించునదేదియును లేదు. అన్ని కార్యములును నీవల్లనే చేయబడు చున్నదని తెలిసికొని యీ దేహమునాదికాదను జ్ఞానముగలిగిన పిదప, నేజే యదుష్కృత్యము లేవియును లేవు అట్టి జ్ఞానము కలుగుటకు ముందు (అనగా దేహమే ఆత్మయని దలచియుండినపుడు) నేజేసిన దుష్కృత్యము లీతీరున సంభవించినదియని చెప్పెను. అంతట ఆయన చుగృచ్చనున్న కొయ్య దగ్ధమైపోయినది. అదివిని యాభద్రగిరిరాజు అన్నియునువదలివచ్చి యాయన పాదములపైబడి ఆయనను ఆశ్రయించియుండి ఆయనవద్ధ వుపదేశమును జెంది మోక్షమునుబొందినట్లు జెప్పియున్నది. నిజమైన తీవ్రముగలిగిన మోక్షము తప్పక సిద్ధించును. అందుకై క్రమముగ పాటుపడవలయును. మొట్టమొదట భక్తిగలిగి భగవద్ధ్యానముచేయుచుండవలయును.

శ్లో॥ విలసత్కన ఫుష్ప ఫుష్ప ఫుష్పం,
విరహా స్త్రీజనమారమారమారం।
వినతామరరాజరాజరాజం,
విషమాక్షం భజకాలకాలకాలం॥

అని అనేకవిధముల సదా భగవన్నామ స్మరణచేయుచు తదేకధ్యానమున మనస్సునుకరిగించవలయును ఆపైన అన్నియంగములును సులభముగలభించును. బిడ్డలు మొదట దోగాడుదురు, పిమ్మట తప్పటడుగులు బెట్టుదురు. అటుపిమ్మట అనాయాసముగ పరుగెత్తుదురు, అట్లే మొదట చనుబాలు, పిమ్మట గంజి అటుపిమ్మట అన్నము దిని రుచులు మారినట్లు సుఖముగ శ్రవణముచేయవలయును, మననముచేయవలయును, పిమ్మట నిధిద్యాసము తనంతటనే యేలవడును. అన్నియును వివేకమువలన గ్రహించవలయును, ఆయువు యెంత పెరిగినను వివేకముమాత్రము బాల్యముగనే యుండిన ప్రయోజనములేదు. వివేకమును వినియోగపరచవలయును. చక్కగ పాటుపడవలయును. కష్టమని విడిచిపెట్టరాదు. 'అడిమేలె అడిఅడిచ్చాల్ అమ్మియుంనగరుం' అనగా, 'దెబ్బమీద దెబ్బవేస్తే దయ్యముకూడా లోబడును.' అనునట్లు వుపన్యాసమునందిట్లు పదేపదే శ్రవణ మననాదులు చేయవలయునని చెప్పడ మెందుకనగా కొందరైనను ఆప్రకారము చేయకపోరను నుద్దేశముతో పలుమారు చెప్పబడుచున్నది.

మోక్షాపేక్ష తీవ్రముగా నున్నయెడల 'కర్మ' యనువారు వ్రాసినట్టి జాబులతో నేమి ప్రయోజనము. ప్రత్యక్షముగా వచ్చిన పాత్రమునకు దగినట్లు చెప్పునది దెలిసికొనవచ్చును. పచ్చికట్టెకు నిప్పుపట్టదు యెండినకట్టెనే శీఘ్రముగ నిప్పుపట్టి చక్కగ మండుకొనును. పరిపక్వమైన మనసుగలవారికొక చిన్నమాట జెప్పినను జాలును. ముముక్షువులు సత్కర్మలొనరించి సద్గురువు నాశ్రయించి వుపదేశమును పొంది కడతేరవలయును. ఆశ్రయించువారిని పెద్దలైనవారొకానొక సమయమున అలక్ష్యముచేసి కోపగించుచుందురు, వాటికన్నిటికిని యోర్చికొని దుర్మార్గమనక కోపగించి కొట్టినతల్లివద్దకు బిడ్డలు మరల నెట్లుచేరబోవుదురో అట్లే వారినివదలక నాశ్రయించుచు వారివలన ఆత్మానందసుఖము ననుభవించు మార్గోపాయమును సంగ్రహించవలయును.

లోకమున సుఖదుఃఖములు సహజములనియును, అమావాస్య పౌర్ణమీలవలె మారుచుండుననియును తెలిసికొనవలయును. మానవజన్మము నెత్తినవాడన్నిటిని సాధించి తాయుమానుస్వామి చెప్పినట్లు 'తున్బకడ్ఱెరిట్టు శైందేరుఱాన్నానంద-విన్బక్కడ్లెర్ వరువదెన్నాళ్ పరాపరమే' దుఃఖముచేత కన్నీరు విడుచుచు కష్టపడువారికి నీధ్యానమువలన గలుగు ఆనందముచేత మైమరచి ఆనందభాష్పములు విడుచునట్టికాలమెప్పుడు సిద్ధించునోయని తీవ్రాపేక్షగలుగవలయును. 'సత్యం సన్నిహితే మృత్యుః' అనుమాటను దలచి దలచి భయమును జెంది శరీర మస్థిరమైనదిగదాయని వైరాగ్యమునబూని కార్యసాధకముచేసికొనవలయునను మనోదారుఢ్యమును దెచ్చికొనవలయును. వైరాగ్యమువలన అసాధ్యకార్యములన్నియును సాధ్యములగుననుటకు మరియు ననేక దృష్టాంతములున్నవి. బాల్యమునుండి వైరాగ్యమునవలంభించిన రామచంద్రుని మహిమవలన జయంతుడను కాకాసురుని విషయమున తృణము మహాస్త్రమైనది. సీతాకల్యాణసమయమున మహాశివధనస్సు తృణప్రాయమైనది. అరకాలిధూళివలన రాయి అహల్యాస్వరూపమును దాల్చినది. పాదుకలు రాజ్యమేలెను. సముద్రము సాధారణముగ దాటగలకాలువ యైనది. వానరులు యుద్ధముచేయసమర్థులైరి. రావణాది రాక్షసవీరులు నరులచేతను వానరులచేతను హతమైరి. కావున మనస్సు అన్నియునువదలి, విషయాదులయందున మనస్సు నేమాత్రమును బోనియ్యక ముముక్షువు మొదట వైరాగ్యమనునిధిని గలిగి యుండవలయును.

ఓం.

శ్రీమత్, బ్రహ్మశ్రీ. బెంగుళూరు, పండిత, శ్రీనివాస భాగవతస్వాముల వారి జ్ఞానవాసిష్టోపన్యాస సంగ్రహము - వైరాగ్యప్రకరణానుబంధము.
శ్రీయుత, సి. యన్. గావుగారు యిట్టుల వ్రాసిరి:—

( పదునారవ సంచిక. )

శ్రీమదాది శంకరాచార్యులవారు 'శ్లో॥ కామక్రోధశ్చ, లోభశ్చ దేహేతిష్ఠంతి తస్కరాః। జ్ఞానరత్నాపహారేణ, తస్మాత్ జాగ్రత జాగ్రత॥' అని చెప్పియున్నారు. అనగా సామాన్యముగు దొంగలు లోకులయిండ్లలో ప్రవేశించి ద్రవ్య వస్త్రాభరణాదులను యెట్లు అపహరించుకొని బోదురో అట్లే కామము క్రోధము లోభము, అను దొంగలు యీశరీరమను యింటి యందు ప్రవేశించి జ్ఞానమను రత్నమును అపహరించుకొనిపోదురు గాన జాగ్రతగా నుండవలయును అని తాత్పర్యము.

కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము; అనునీయారును అరిషడ్వర్గము లనబడును. ఇవి మాయా సంబంధమైనవి మాయకలిగినవుడు జ్ఞానము మరుగైపోవును. మాయ ఆవరించుకొని యున్నంతవరకును మనుజుడు జ్ఞానము తనవద్దనున్నదని యెరుగడు. దాహము గొనియున్నవాడు పాచిచే నావరించియున్న గుంటనుజూచి యది పాడు గుంటయనుకొని నీటికై వెదకుచుండగా తెలిసినవాడు యీపాచిని యటు తొలగించి జూపిన పిదప తేటనీటిని తెలిసికొనునట్లు 'పాచెగదోసి శుద్ధోదకము నెత్తునట్టుల ముక్తినిగాంచవలయు' నని పెద్దలు చెప్పియున్నారు. ఉన్న వస్తువు లేనిదిగను లేనివస్తువు వున్నట్టుగను మనస్సును భ్రమింపజేయు నదియే మాయ యనబడును. ఆమాయనే అజ్ఞానమనియును చెప్పబడును. 'నాసతో విద్యతే భావో, నాభావో విద్యతే సతః' యను భగవద్గీత, రెండవ అధ్యాయ, 16 శ్లోకమునందు చెప్పియున్నట్లు 'సత్' అనగా సత్తైన (నశింపులేక శాశ్వతమైన) పరమాత్మకు అనిత్యత్వమును, 'అసత్' అనగా అసత్తైన (నశింపుగలిగి శాశ్వతముకాని) శరీరమునకు నిత్యత్వమును లేదని తెలియవలయును. మాయయనునది లేనట్టి మిథ్యావస్తువుగాన అనిర్వచనీయ్యామైనది, అనగా, యిట్టిదని చెప్పడమునకు గూడనిది. 'యామా సామాయా' అనగా యేదిలేకనే వున్నట్టుగతోచునో అదియే మాయ. దానిని విచారణవలన చక్కగ తెలిసికొనదగును. అట్లు తెలిసికొనినపిదప యీమాయ యుండదు తక్షణమే వీడిపోవును. ఇంటిలో పలదూరిన దొంగ తనను యింటివారు

కనుగొనినంతట యెట్లుపారిపోవునో అట్లే మాయ యను 'అసౌవాదిత్య బ్రహ్మః' యని 'బ్రహ్మస్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వరం। సాయంధ్యాయేత్సదావిష్ణుర్ త్రిమూర్తిశ్చ దివాకరః॥' యనియనునట్లు భగవత్స్వరూపుడై ప్రపంచమున కంతయును ప్రకాశమును గలుగజేయు సూర్యుని మేఘము (మబ్బు) మూసికొనినప్పుడు యాప్రకాశమెట్లు కనబడదో అట్లేమాయ (అజ్ఞానము) యనునది మనస్సును ఆవరించియుండునంత వరకును జ్ఞానముగలిగి సంసారాది బంధములు తొలగించి ఆనంద సుఖమును అనుభవించజాలము, దీనిని యెఱుగమిచే అజ్ఞానములోబడి మనస్సు దిగులు భయమును జెందుచుండును. ఒక చిన్నపిల్లవానిని బెదరించుటకు వానియన్నయైన పెద్దపిల్లవాడు వొక పెద్దభూతపు బొమ్మతలకాయను తనతలకు దగిలించుకొని భయపడించిన, యాచిన్నపిల్లవాడు దానినిజూచి భూతమను భ్రమచే భయపడి యేడ్చును, యాభూతపుబొమ్మ తలకాయను దీసివేసిన తనయన్నముఖమును జూచిన తత్క్షణమే యాభ్రమయును భయమును దీరిపోయి తనయన్నయని తెలిసికొని వానిని జూచి ఆనందముగ నవ్వుచుండును. ఈప్రకారము ప్రపంచమునందు దృశ్యమగు సమస్తమును మిథ్యయనియును భ్రమవలన కల్పించుకొనబడినదనియును, యదియేమాయయగునియును మాయకుగుణరూపాదులు లేవనియును దెలిసికొని యామాయను తొలగించిన అన్నివిధములైన దుఃఖములును భయములును తోడనే తొలగిపోయి జ్ఞానోదయముగలిగి యానందసుఖము ననుభవించవచ్చును. ఇటువంటి దృష్టాంతము లనేకములున్నవి. ఇప్పుడు సూక్ష్మముగా జెప్పబడినది. ఈవాసిష్టములోని వెనుకటి ప్రకరణముయందనేక వుపమానములను జెప్పవలసిన యవకాశమువచ్చును. అప్పుడింకను విశదముగా దెలిసికొనవచ్చును.

లోకమునందు మాయను, స్త్రీవాచకముగవాడుకొందురు, యేల యనగా, ప్రజలయొక్క యుత్పత్తి (పుట్టుక) స్త్రీలింగములయందుండియే గాన సమస్తమునకును యుత్పత్తిస్థానమైన భూమిని సహితము స్త్రీవాచకముగనే వాడబడుచున్నది. అందునబట్టి ప్రపంచము (జగత్తు) యొక్క యుత్పత్తికి మాయయే కారణమగుటవలన యామాయను స్త్రీవాచకముగనే జెప్పవలయును. ద్వైతభావమును భేదాభేదములును యామాయాజనితములేమైయున్నవి. మహానుభావుడైన రామకృష్ణ పరమహంసగారు

అమెరికా దేశమునకు బోయియుండినపుడు ఆ దేశస్థులతో నొకరు 'Who is your God, whether master or mistress' మీ దేవుడెవరు, స్త్రీయా, పురుషుడా? యని యడిగినందుకు, రామకృష్ణ పరమహంస గారిట్లు బదులు జెప్పిరి. *'My God is neither master nor mistress but Mistery'* మా దేవుడు పురుషుడునుగాదు స్త్రీయునుగాదు, అగోచర మూర్తియనిజెప్పిరి. ఇదిగాక శ్రీశంకరాచార్యులవారు భగవంతునినిట్లు, ధ్యానించియున్నారు. శ్లో॥ యస్యాన్తర్ నాదిమధ్యమ్, నహికరచరణమ్, నామగోత్రం, నసూత్రం । నోజాతి ర్నైవవర్ణా, నభవతి పురుషో, నా నపుంసం, నచ స్త్రీ । నాకారం, నిర్వికారం, నహిజనిమరణం, నాస్తి పుణ్యం, నపాపం నోతత్వం, తత్వమేకం, సహజసమరసం సద్గురుం, తంనమామి॥', ఆదిమధ్యాంతరహితమైనట్టియును, కరచరణాద్యవయవములు లేనట్టియును, కులగోత్రసూత్ర నామాదులు లేనట్టియును, స్త్రీత్వ, పురుషత్వ, నపుంసకత్వములు లేనట్టియును, ఆకారవికారములు లేనట్టియును, జనన మరణాదులు లేనట్టియును, పుణ్యపాపములు లేనట్టియును, సాత్వికేతరతత్వములు లేనట్టియును, సహజసమరసమైనట్టి సద్గురు మూర్తికి నమస్కారముచేయుచున్నానని.

నిద్రబోవునపుడు ఐశ్వర్యాదులననుభవించి యానందించునటులను ఆపదలననుభవించి దుఃఖించునటులను స్వప్నములను గనుసమయమున యవి యన్నియును నిజముగనే దోచును, యానిద్రనుండి మేల్కొని నంతట యవికలలు (కల్లలు) అబద్ధములు అని తోచునటుల, శ్లో॥ సంసారంస్వప్న తుల్యోహి, రాగద్వేషాది సంకులః । సకాలేసత్యవద్భాతి, ప్రబోధేత్యసత్తసద్భవేత్॥ యనునట్లు, సంసారభ్రాంతియనునది స్వప్నమువంటిదియును రాగద్వేషాది సహితమైన మాయయనునది యావరించి యుండునంతవరకును నిజమను భ్రమను గల్పించి పారమార్థికావస్థవచ్చి జ్ఞానముగలిగినపిదప తొలగిపోవును.

'శ్లో॥ బ్రహ్మవిష్ణుశ్చరుద్రశ్చ సర్వావా భూతజాతయః । నాశమేవానుధావంతి సలిలానావ బాడవ॥' బ్రహ్మవిష్ణుమహేశ్వరులను త్రిమూర్తులును శక్తియొక్క పీఠముక్రింద ప్రేతములై పడియున్నవారిని సముద్రమునందు గలిపియాసముద్రమును యాశక్తిమ్రింగుచున్నదని దేవిభాగవతమునందు నజెప్పియున్నది. ఆ దేవి(శక్తి)యొక్క పుత్పత్తికిని మాయయే కారణము.

ప్రపంచవ్యవహారమున స్త్రీలనియును పురుషులనియును, మాయామయమై యున్నదిగాని, నిజముగ 'సర్వంవిష్ణుమయంజగత్' అను నట్లు జగత్తంత యును భగవత్స్వరూపమైయున్నది. శివుడు పురుషభావముగాన పితయని యును విష్ణుశక్తి (ప్రకృతి)భావముగాన మాతయనియును చెప్పబడును. శ్లో॥ శాంతంయాంతం త్రివారం ప్రణవకసహితం యోభ్రవీశ్చప్రదోషే॥ నామపర్యాయములు, ఓంకార యని స్మరించినవారికి త్రిలోకములును, రామయని యొకపర్యాయము స్మరించినవారికి రెండులోకములును లభిం చునని జెప్పియున్నది. శి వా న ం ద ల హ రి య ను గ్రంథమునందు,
శ్లో॥ బాణత్వంవృషభత్వమర్ధవపుషా, భార్యాత్వమార్యాపతే । ఘోణి త్వంసఖితామృదంగవహతా, చేత్యాదిరూపందధౌ । త్వత్పాదేనయనా ర్పణం చకృతవాన్, త్వద్దేహభాగోహరిః । పూజ్యాత్పూజ్యతరస్స ఏవహి నచేత్కోవాత్వదన్యోధికః॥యని శ్రీశంకరాచార్యులవారు జెప్పియున్నారు. అనగా విష్ణువు బాణత్వమును, వృషభవాహనత్వమును, సగముశరీరధార ణముచే భార్యాత్వమును, వరాహత్వమును, స్నేహత్వమును, మృదంగవా ద్యధారణత్వమును, మొదలయిన రూపములనుధరించి, శివుని పాదారవిం దములయందున దృష్టినుంచి యాయన అర్ధశరీరమునందున్నందున బ్రహ్మాది దేవతలకందరకన్నను విష్ణువు శ్రేష్ఠముగ పూజించదగిన వాడాయనని జెప్పియున్నారు. ఇందువలన శివుడునువిష్ణువును వొకటేయని తాత్పర్యము. త్రిమూర్తులకుపైగా శక్తినిజెప్పియున్నది. ఇట్లు వ్యవహారమున కనేకవిధ ములుగ జెప్పవలసియున్నది. పురాణాదుల నాక్షేపించరాదు. వొక్కొ కదాని యందొక్కొక విధమున జెప్పియుండును. వాటికి సమరసార్థమును సద్గురుమూర్తివలన దెలిసికొనదగును. విష్ణువు పరమాత్మయనియును జెప్పి యున్నది. ఇది హెచ్చు అది హెచ్చు అని చెప్పరాదు. సర్వసమత్వభావము చక్కగ బోధపడుటకే వొకప్పుడొక దానియందు యిదియే గొప్పగను మరియొకప్పుడు మరియొక దానియందు యదియేగొప్పగను జెప్పియున్నా రు. ఇందుకు దృష్టాంతముగ విష్ణువుయొక్క గొప్పతనమును గూర్చి, పశు, శిశు, వధు, రాక్షసులు, సాక్షియని జెప్పిరి. అనగా, గజేంద్రుడును, ప్రహ్లాదుడును, అహల్యయును, విభీషణుడును సాక్షిగ జెప్పియున్నారు. శివునియొక్క గొప్పతనమునుగూర్చి మార్కండేయులవారు మొదలయినఋ షులను సాక్షిగ జెప్పియున్నారు. వ్యాసమహర్షి పదునెనిమిది పురాణముల

న వ్రాసిరి. అందున విష్ణుపురాణమును వ్రాయునప్పుడొకనాడు గంగలో ఋషులందరు స్నానము చేయుచుండగా వారివారిలో యెవరు గొప్పయని వ్యాసులవారిని తక్కినఋషులందరడుగగా హరి (విష్ణువు) గొప్పయని వ్యాసులవారు హస్తమును పైకెత్తగా అట్లెత్తబడిన హస్తము అట్లే నిలచిపోయినట్లు చెప్పియున్నది. విష్ణువే నాకు గొప్పయని శ్లాఘించిరి. శ్రీమహాభారతమునందు 'శ్లో|| వాసుదేవం పరిత్యజ్య, మోహితా మమ మాయయా। అతోహం స్వాత్మనో మాయా, జ్ఞాపయన్ పూజయామి తం||' యనియున్నట్లు భగవంతుని వదలి యితరమైనవాటిని స్మరియించువారు యెట్టివారనగా, గంగలో నిలచియుండి దప్పి దీర్చుకొనుటకు వేరొక బావిని వెదకుచు చింతించువారి వంటివారని తెలియవలయును. భగవద్గీత నాల్గవ అధ్యాయము, ఆరవశ్లోకమునందు, 'అజోపిసన్నవ్యయాత్మా, భూతానామీశ్వరోపిసన్ । ప్రకృతిం స్వామధిష్ఠాయ, సంభవామ్యాత్మమాయయా ||' యనగా నాకు జననమరణాదులు లేకపోయినను, పిపీలికాది బ్రహ్మపర్యంతముగల ప్రాణులయొక్క సృష్టిస్థితిలయములకు నేను కర్తనగుటవలన స్వకీయమైన ప్రకృతిని (మాయను) నేనే కల్పించుకొని నా మాయచేత పుట్టుచున్నాను అని కృష్ణభగవానులు చెప్పియున్నారు.

వస్తువు ఒకటియే యైయున్నను మాయాసంబంధమువలన వేర్వేరు నామరూపములుగ పరిణమించుచున్నది. ఆమాయ వదలిపోయిన యెడల శ్రీసదాశివబ్రహ్మముగారు చెప్పినటుల 'పరమహంసరూపేణ విహర్తా' యని యివివరలో ౧౧వ వుపన్యాసములో (౧౧వ సంచిక, ౨వ భాగము ౩వ పుటలో) చెప్పియున్న శ్లోకార్థము ప్రకారము భగవంతునికి నామరూపాదులు లేవని తెలియవలయును, 'విభూతిర్భూతిరైశ్వర్యం||' అను విభూతిమహాత్మ్యమునందు యిట్లు చెప్పియున్నది, విభూతిధారణము చేయుడములో మొదట జలమును చేర్చక విభూతిని మాత్రము శరీరమంతయును ధారణము చేసికొనవలయును, అది పరబ్రహ్మముయొక్క సర్వవ్యాపకత్వమును సూచించుచున్నది, పిదప జలము చేర్చి త్రిపుండ్రరేఖలుగా ధారణము జేసికొనవలయును, అది ప్రకృతి (మాయ) సంబంధమువలన త్రిగుణాత్మకమైనదని సూచించుచున్నది, అని తెలియవలయును. ఇట్టి మాయాశక్తిని జయించుట మిక్కిలి కష్టము.